కావ్యపరిచయాలు

# ఆముక్త మాల్యద

## శ్రీకృష్ణదేవరాయలు

సంపాదకుడు

శ్రీ ఎం. వి. యల్. నరసింహారావు

నూజివీడు




ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్, సైఫాబాద్, హైదరాబాద్-500 004.

# తొలి పలుకు

తిక్కన యుగము నుంచి తిరుపతి వేంకట కవుల యుగము వరకు అనగా కొన్ని నూర్ల సంవత్సరాల పాటు తెలుగు సాహిత్యానికి ఒక విశిష్టతను చేకూర్చినది ప్రబంధమండలి విభాగము. తెలుగు ప్రబంధాలు కావ్య శిల్పానికి ఆటపట్టులు-పండితులకే కాక రసజ్ఞులకు కూడ యీ ప్రబంధాలలోని ముఖ్యమైన పద్యాలు కంఠస్థాలు. ప్రాచీనాంధ్ర సాహిత్యములో అనేక శతాబ్దాల పాటు ప్రధానస్థానము నాక్రమించిన యీ ప్రబంధాలను కొన్నింటిని పాఠక లోకానికి అందించవలెనని నిశ్చయించి ఆంధ్ర కేంద్ర ప్రభుత్వముల సహకారముతో యిప్పటి వరకు ౪౫ కావ్యాలను అకాడమి ప్రకటించినది. ప్రతి కావ్యానికి ౪౦ పేజీల పీఠికను సమర్థులైన సంపాదకులచే వ్రాయించినది. ఇట్లు ప్రచురించిన కావ్యాలు జనాదరణ పొందినవి.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి అనేకమైన సారస్వత కార్యక్రమాలను రూపొందించినది. ఇప్పటి వరకు రెండు నూర్లకు పైగా గ్రంథాలను ప్రకటించినది. ఇందులో పరిశోధనకు సంబంధించిన గ్రంథాలతో పాటు సాహిత్య ప్రధానమైన గ్రంథాలు గూడ ఉన్నవి. ప్రాచీన వాఙ్మయాన్ని, ఆధునిక వాఙ్మయాన్ని రెండింటిని ప్రోత్సహించుట సాహిత్య అకాడమి ఆశయము.

సాహిత్య అకాడమి ప్రకటించిన ప్రబంధాలను పరిశీలించిన విజ్ఞులు కొందరు ప్రబంధాలను కొన్నింటిని లఘు పుస్తకాల ద్వారా పరిచయము గావించుట బాగుండగలదని సూచించినారు. ఈ సూచనకు శ్రీ ఎమ్. ఆర్. అప్పారావుగారి ప్రేరణ తోడైనది. తత్ఫలితముగా పారిజాతాపహరణము, మనుచరిత్ర, ఆముక్త మాల్యద, వసుచరిత్ర, పాండురంగ మాహాత్మ్యములను అయిదు లఘు పుస్తకాల ద్వారా పరిచయము చేయవలెనని అకాడమి కార్యవర్గము నిర్ణయించినది. అందరికి అందుబాటులో నుండవలెనను ఉద్దేశముతో వీని వెల కూడ స్వల్పముగా నిర్ణయించనైనది.

ఈ అయిదు పుస్తకాలను సిద్ధము చేసినవారు శ్రీ ఎం. వి. ఎల్. నరసింహారావుగారు. వారు నూజివీడు ధర్మ అప్పారావు కళాశాలలో తెలుగు ఉపన్యాసకులు. మేము కోరినదే తడవుగ యీ పుస్తకాలను సిద్ధముచేసి యిచ్చిన శ్రీ నరసింహారావుగారికి అకాడమి పక్షాన కృతజ్ఞతలు. ఇక ముందు మరికొన్ని కావ్యాలను యీ విధముగ పరిచయము చేయవలెనని అకాడమి సంకల్పము. ఆంధ్ర మహాజనుల ఆదరణ యిందుకు లభించగలదని విశ్వాసము.

హైదరాబాదు
12-8-74

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి

# కావ్య పరిచయం

ఆంధ్ర పంచ కావ్యాలలో ఆముక్తమాల్యదకు రాజఠీవి ఉంది. కృతికర్త కృష్ణదేవరాయలు సాహితీ సమరాంగణచక్రవర్తి కావడంవల్ల రాయలు రచించిన కావ్యం కూడా సాహిత్యరాజ్యంలో చక్రవర్తిలా చెలామణి అవుతోంది. రచనలో, రస సృష్టిలో, వర్ణనా 'రామణీయకతలో, కథలో, కథనంలో, పాత్ర చిత్రణలో ఆముక్తమాల్యదకు ప్రత్యేకత ఉంది. కృష్ణరాయనిది సునిశితమైన దృష్టి, సున్నితమైన కవితాసృష్టి. వ్యర్థపదాలు పరిహరించటంవల్ల పద్యంలో వచ్చే బిగింపు రాయల రచన నొకింత అభేద్యం చేసినా ప్రతి పద్యంలో పతి పద ప్రయోగములో జాలువారే రసవాహిని పాఠకులను ఆనంద పరుస్తుంది. బ్రహ్మానందమని చేప్పే అలౌకిక స్థితికి చేరుస్తుంది.

కృష్ణరాయలు ఎప్పుడు పుట్టాడన్న విషయం పరిశోధకులు సరిగా తేల్చ లేక పోయారు. పరిశోధకులు చెబుతున్న తేదీలు పరిశీలిస్తే రాయలు క్రీ. శ. 1487 ప్రాంతాన జన్మించి ఉండవచ్చునని చెప్పుకోవచ్చు. కృష్ణరాయల తండ్రి నరసా నాయకుడు. నరసానాయకుని ముగ్గురు భార్యలలో రెండవభార్య అయిన నాగాంబకు జన్మించిన వాడే కృష్ణరాయలు. నరసానాయకుడు కవిజనాదరణ చేసి నంది ఘంట కవుల నించి వరాహపురాణాన్ని అంకితం పుచ్చుకున్నాడు. తండ్రికి గల సాహిత్యాభిరుచిని చిన్ననాటి నుంచి గమనించటంవల్ల రాయలకు కూడా సాహిత్యాభిమానం కలిగిందని భావించవచ్చు. రాయలకు బాల్యంనుంచి సంగీతం అంటే ఇష్టం. బాల్యంలో కృష్ణయ్య అనే విద్వాంసుని దగ్గర వీణ నేర్చుకున్నాడు. కావ్యనాటకాలంకారాల మర్మాలు అవగాహన చేసుకున్నాడు. కళలన్నీ ఆకళించుకున్నాడు, అపర భోజుడుగా, ఆంధ్రభోజుడుగా కీర్తింప బడ్డాడు. రసాఖండ కవికావ్యాలు రాయలకు కర్ణకుండలా లయాయి. అష్టదిగ్గజాలు రాయల భువన విజయంలో నిలబడి సాహిత్యరంగంలో వీర విహారం చేశాయి. రాయల పరిపాలన స్వర్ణయుగంగా కీర్తన లందటంవల్ల ఆయన పరాక్రమంగురించి, సాధించిన విజయాల గురించి ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరంలేదు.

రాయలు కవిపండిత పోషకుడేకాక స్వయంగా సంస్కృతంలోను, ఆంధ్రంలోనుకూడా కావ్యరచన చేశాడు. మదాలస చరిత్ర రాయల తొలి కృతి. సత్యా వధూ ప్రీణనం, సకల కథాసార సంగ్రహం అనే సంకలనం, జ్ఞాన చింతామణి, రసమంజరి అనేవి రాయల సంస్కృత కృతులు. ఆముక్తమాల్యద ఒక్కటే తెలుగులో రచించిన కావ్యం. రాయల సంస్కృత కావ్యాలజాడ ఈనాడు కానరాకపోయినా ఒక్క ఆముక్తమాల్యద వల్లనే రాయల పాండితీ వైభవాన్ని, ఉభయభాషలలో ఆయనకుగల ప్రజ్ఞాపాటవాన్ని గుర్తించవచ్చు.

కృష్ణరాయలకు ఆంధ్రవిష్ణువు కలలో కనబడ్డాడు. సంస్కృతంలో అనేక కావ్యాలు రచించిన రాయలను ఆంధ్రభాషలో కావ్యరచనచేసి అంకితం చేయవలసిందిగా కోరాడు. దేశభాషలలో తెలుగు లెస్స కనుక కలకండవంటి తెలుగుభాషలోనే కృతి రచించమని చెప్పాడు. విష్ణుచిత్తుడు, ఆండాళమ్మ, తమిళదేశంలో గొప్ప కవిత్వంచెప్పిన వ్యక్తులు. పన్నెండుమంది ఆళ్వారులలో ప్రముఖస్థానం ఉన్నవారు. వీరి చరిత్రనే రాయలు ఆముక్తమాల్యదగా కథనం చేశాడు. గోదాదేవి శ్రీరంగనాథుల వివాహం ఈకావ్యంలో ప్రధాన కథ.

ఆముక్తమాల్యద కృష్ణరాయలుకాక అల్లసాని పెద్దనే రచించి రాయల పేర పెట్టాడన్న కథ ఒకటి ప్రచారంలో ఉంది. కాని ఆముక్తమాల్యద, మను చరిత్ర కావ్యాల శైలిని పరిశీలించినట్లయితే రెండుకావ్యాలు ఒకేకవి రచించ టానికి అవకాశంలేదని తెలుస్తుంది పెద్దన రచించాడన్న ఆధారాలను ఖండిస్తూ పరిశోధకులు ఆముక్తమాల్యదకు కృష్ణరాయడే కృతికర్త అని నిర్ణయించారు.

ఆముక్తమాల్యదలో కథకన్నా వర్ణన లెక్కువ. కథని వదలి ఋతు వర్ణనలు చేసినా రాయల వర్ణనలు తక్కిన కవులకంటె భిన్నంగా ఉంటాయి. రాయల వర్ణనలలో సామాన్యమైన విషయాలు, సామాన్యజనుల జీవితాలలో కన బడే చిన్నిచిన్న సంగతులు చోటుచేసుకుంటాయి. వర్షాకాలంలో 'గగనము నీరు బుగ్గ కెనగాజడి పట్టినప్పుడు' తడిసిన కట్టెంతో కళ్లలోకి పొగపోయేలా కష్ట పడకుండా విష్ణుచిత్తుని భార్య నారికేళపు బొరియలు తగిలించి వంటచేసేదన్న సూక్ష్మమైన పరిశీలన రాయల రచనలోతప్ప మరే కవిలోనూ కనబడదు. రెక్కలలో తల దూర్చుకొని బాతులు పంటపొలాల పక్కకాలువల్లో పడుకుని ఉండటం రాయలు తప్ప మరెవరూ చూడలేదు. అలా పడుకున్న బాతులనుచూసి

బ్రాహ్మణులు విడిచి పెట్టిన అంగవస్త్రాలని కాపలాదారులు భ్రమపడ్డారని చెప్పే విచిత్రమైన ఊహ రాయలకు తప్ప మరెవరికీ రాదు వారు ఆ అంగవస్త్రాలు భద్ర పరచటానికి రేవులలో దిగినప్పుడు అవి ఎగిరిపోయేవని, వారి భ్రమచూసి మంచెలమీద కాపలాకాస్తే ఆడవారు నవ్వేవారని పద్యానికొక సరికొత్త ముగింపు ఇవ్వటం కూడా రాయల ప్రత్యేకతే! పద్యం ముగించేటప్పుడు ఇతరకవుల్లాగా వ్యర్థపదాలు వెయ్యకుండా కొసమెరుపులివ్వటం కృష్ణరాయల రచనలో కన బడుతుంది. గోదాదేవి యౌవన వర్ణనలో కవులందరిలాగా అంగాంగ వర్ణనకే పరిమితంకాకుండా తెలుగువారి సంప్రదాయాలు మిలమిలలాడే వర్ణనలు రాయలు చేశాడు. విచిత్రమైన ఊహ, దానికి తగిన పద్యపు నడక, పద్యానికి తగిన భాష, భాషలో సరికొత్తగా కనబడే పదబంధాలు, పదాలు కృష్ణదేవరాయల్ని కవిచక్రవర్తిని చేస్తాయి.

## కథాసంగ్రహం

పాండ్యదేశంలో విలిబుత్తూరు పట్టణం సమస్త సంపదలతో విరాజిల్లు తోంది. అచటి భాగవతులు అతిథి అభ్యాగతులకు భోజనాది సత్కారాలు శ్రద్ధాభక్తులతో చేస్తారు. వారిలో విష్ణుచిత్తుడు ఉత్తమోత్తముడు. పూర్వజన్మ సుకృతం వల్ల పఠించకుండానే సమస్త విద్యలు నేర్చినవాడు. నిరంతరయోగ నిష్ఠ అనే సంకెల చేత భగవంతుడనే మదగజాన్ని బంధించినవాడు. నిత్యం తులసి మాలలు కట్టి భగవంతునికి కైంకర్యం చేసేవాడు.

### ద్వితీయాశ్వాసము

అప్పుడు పాండ్యదేశానికి మధురాపురం రాజధాని. చంద్రవంశానికి చెందిన మత్స్యధ్వజుడు రాజు. సర్వ సద్గుణ సంపన్నుడైన ఆ రాజు గొప్ప దాత. ఈతి బాధల్లేకుండా ప్రజాపాలన చేస్తున్నాడు. వేసవికాలాన ఆ రాజు విలాసవతి అయిన భోగిని గృహానికి వెడుతూ వెన్నెలలో అరుగులమీద పడు కున్న బ్రాహ్మణులలో ఒకరు చెప్పే సుభాషితం విన్నాడు. పరంకోసం ప్రస్తుతం చేస్తున్న ఆలోచన ఏమిటి అన్న అతని మాట రాజును కలవర పరచింది. పరలోకానందానికి ప్రయత్నించాలనుకున్నాడు. సర్వమత సిద్ధాంతులను రావించి కొలువు తీర్చి వారికి వాదం ఏర్పాటు చేశాడు.

విలిబుత్తూనరులో మన్నారు దేవుడు తనను సేవించటానికి వచ్చి విష్ణు చిత్తుణ్ణి మధురలో జరుగుతున్న వాదాలలో పాల్గొని తన మహత్యాన్ని స్థాపించి రాజును వైష్ణవుని చెయ్యమని కోరాడు. విష్ణుచిత్తుడు తన అశక్తత తెలియ జేశాడు. నీకు తప్పక విజయం చేకూరుతుందని భగవంతుడు అభయమిచ్చాడు.

## తృతీయాశ్వాసం

విష్ణుచిత్తుడు మధురకు వెళ్లి వాదంలో గెలిచి బహుమానాలు పొందాడు. శ్రీమన్నారాయణుడే పూజ్యుడని చెప్పే ఖాండిక్య కేశిధ్వజుల కథ చెప్పాడు.

నిమివంశంలో ధర్మధ్వజుడు, కృతధ్వజుడని ఇద్దరన్నదమ్ములుండే వారు. ధర్మధ్వజునికి ఖాండిక్య ధ్వజుడు, కృతధ్వజునికి కేశిధ్వజుడు జన్మించారు. ఖాండక్యుడు కార్యశూరుడు. కేశిధ్వజుడు విజ్ఞాని. పెద్దవారయాక ఇరువురికీ రాజ్యకాంక్ష పెరిగింది. కేశిధ్వజుడు యుద్ధంలో సోదరుని జయించాడు. ఖాండిక్యుడు భటులతో, హితులతో అడవులకు పోయాడు. కేశిధ్వజుడు విజయం సాధించాక యజ్ఞయాగాలు చేస్తూ ఒక మహావ్రత దీక్షలో మునిగి పోయాడు. ఆ యజ్ఞంలో బలి పశువుగా రాజు పెంచుతున్న ఆవు ఒకనాడు పులివాతబడింది. యజ్ఞం నిర్విఘ్నంగా జరగటానికి చేయవలసిన ప్రాయశ్చిత్తం ఏమిటని కేశిధ్వజుడు మునులను అడిగాడు. వారు కసేరువును అడగమన్నారు. కసేరుడు శౌనికుని అడగమన్నాడు. శౌనకుడు తనకూ తెలియదని, అరణ్యవాసం చేస్తున్న ఖాండిక్యుడు చెప్పగలడని అన్నాడు. కేశిధ్వజుడు సోదరుడు తనను చంపినాసరే అని అరణ్యానికి వెళ్లాడు. కేశిధ్వజునికి ధర్మ సూక్ష్మం చెప్పవద్దని మంత్రులన్నారు. కాని ఖాండిక్యుడు వారి మాట వినక ప్రాయశ్చిత్తాన్ని తెలియజేశాడు. కేశిధ్వజుడు యజ్ఞం పూర్తి చేసి ఖాండిక్యునికి గురుదక్షిణ యివ్వబోయాడు. మంత్రులు రాజ్యం కోరమన్నారు. కాని ఖాండిక్యుడు ఇహలోక చింతన వదిలి, మోక్షోపాయాన్ని బోధించమని కేశిధ్వజుణ్ణి కోరాడు. నిమివంశం పవిత్రం కావటానికే నీకీ తత్వ విచారం కలిగిందని చెప్పి కేశిధ్వజుడు ఖాండిక్యునికి తత్వబోధ చేశాడు. అష్టాంగక సాధనమే మోక్షోపాయమన్నాడు. విష్ణువే పరదైవమన్నాడు. ఖాండిక్యుడు తన కొడుక్కి పట్టాభిషేకం చేసి మంత్రులకు రాజ్యం అప్పగించి విష్ణువులో కలిసిపోయాడు.

విష్ణుచిత్తుడు ఈ కథ చెప్పి రాజును వైష్ణవునిగా మార్చాడు. రాజు విష్ణు చిత్తుణ్ణి గజాధిరోహణం చేయించి వైభవంగా ఊరేగించాడు.

## చతుర్థాశ్వాసం

గరుడవాహనుడు ప్రత్యక్షమై విష్ణుచిత్తుడు పాడిన తిరుప్పల్లాండును, దశావతారస్తోత్రాన్ని విని అనుగ్రహించి విష్ణుచిత్తుని గృహం సర్వసంపదలతో తులతూగాలని ఆనతిచ్చి అంతర్ధానమయాడు. విష్ణుచిత్తుడు విలిబుత్తూరుచేరి భగవంతుని మహిమకు ఆనందభరితుడై పూర్వంకంటె భక్తిశ్రద్ధలతో భగవదర్చన చేయసాగాడు. విష్ణుచిత్తుడొకనాడు మాలిక సమర్పించి యింటికి మరల గానే మన్నారుస్వామి "పూర్వం యామునాచార్యునివంటివాడు ఈ విష్ణుచిత్తుడు" అని తన దేవేరితో అన్నాడు. ఆమె యామునాచార్యునిచరిత్ర చెప్పమని కోర గానే స్వామి చెప్పసాగాడు.

యామునాచార్యుడు భక్తుడైన నాథముని మనుమడు. బాల్యంలోనే వేద శాస్త్రాధ్యయనం చేశాడు మధురలో మత్స్యధ్వజుని పూర్వీకుడు రాజ్యం చేస్తుండేవాడు. అతడు వీరశైవుడు. పైగా వైష్ణవద్వేషి. అతని భార్య విష్ణు భక్తురాలు. ఆ రాజాస్థానానికి వెళ్లి వాదించి వైష్ణవాన్ని స్థాపించాలని యామునా చార్యునికి కోరిక కలిగింది. రాణికి విన్నవించి ఆమెను ఒప్పించి నిండు సభలో వాదానికి సిద్ధమయాడు. ఎవరు ఓడిపోయినా స్వీయమతాన్ని వదిలి యితరుల మతాన్ని స్వీకరించాలన్నది నియమం. యామునా చార్యుడు నెగ్గాడు. విష్ణుడే పరతత్వం అని నిరూపించాడు. అక్కడ ఎదురుగా వున్న రావి చెట్టునించి ''ఇది నిజం-నారాయణుడే దేవుడు. ఇతనివి సేవించు'' అనే మాటలు విన బడ్డాయి. రాజు యామునాచార్యునికి తన సోదరినిచ్చి వివాహం చేసి అర్ధ రాజ్యం సమర్పించి గౌరవించాడు. యామునాచార్యుడు దిగ్విజయం సాధించి యజ్ఞాలు చేసి భోగభాగ్యా లనుభవిస్తూ రాజ్యం చేయసాగాడు.

శ్రీ రామమిశ్రుడు యామునాచార్యుని తాతకు ప్రశిష్యుడు. యామునా చార్యుణ్ణి ఈ బంధాలనించి ఏలా తప్పించాలా అని ఆలోచించి అతనికి అతి సాత్వికాహారంగా ములుముస్తె కూర పెట్టించాడు. దానితో యామునాచార్యునికి ఆత్మజానం కలిగింది. "మీ పెద్దలు మీ కోసం జాగ్రత్త పరచిన నిక్షేపాన్ని చూపించటానికి వచ్చాన" ని శ్రీ రామమిశ్రుడు చెప్పాడు. శ్రీరంగానికి

తీసుకువెళ్లి రంగనాధుని పాద పద్మాలే ఆ నిక్షేపం అని చూపగానే యామునా చార్యుడి భ్రమ తొలగిపోయింది. కుమారుడికి రాజనీతి ఉపదేశించి పట్టాభిషేకం చేసి సన్యసించాడు. ఇది యామునాచార్యుని కధ అని మర్నాడు దేవుడు తన దేవేరికి చెప్పాడు.

## పంచమాశ్వాసం

విష్ణుచిత్తునికి తులసివనంలో ఒచ ఆడ శిశువు కన బడింది. శుభాంగి అయిన ఆ బిడ్డను భార్యకు అప్పగించాడు. ఆమె భూదేవి అవతారమైన గోదా దేవి. ద్వాపరంలో ఆమె సత్యభామ. అప్పటి చెలులైన నాగకన్యకలు యిరుగు పొరుగు భాగవతుల యిళ్లలో చెలులుగా జన్మించారు. అందరూ కలిసి మెలసి ఆడుకుంటూ శ్రీమన్నారాయణుని గుణాలు కీర్తిస్తూనే బాల్యదశ దాటి యౌవనంలో అడుగు పెట్టారు. వయసు వచ్చిన గోదాదేవి శ్రీ రంగేశుణ్ణే వివాహ మాడాలనుకుంది.

విష్ణుచిత్తుడు తులసి మాలలుకట్టి భగవంతుని సేవకు సిద్ధం చేయగా గోదాదేవి తండ్రికి తెలియకుండా ఆ మాలికను తాను అలంకరించుకుని బావి నీటిలో సొగసు చూసుకొని తిరిగి ఆ మాలికను సెజ్జలో వదిలేసేది.

గోదాదేవి శ్రీ రంగనాధుని వరించిన విరహంతో వేగిపో సాగింది. పూర్వజన్మ స్మృతులు కలగగానే భరించలేక సోలి పోయింది. ప్రాణ త్యాగం చేయటానికి నిశ్చయించుకుంది. చెలులువారించి ఉపచారాలు చేసినా ఊరడిల్లలేక పోయింది. గోదాదేవి స్థితి గమనించి విష్ణుచిత్తుడు ఆలయంలో దేవునితో మొర పెట్టుకున్నాడు. "ఎంత భక్తివున్నా అంతగా శరీరాన్ని కృశింప జేసుకోవటం న్యాయంకాదు. ఆమె అంతర్యాన్ని నీవే తెలుసుకొని మాకు చెప్పవలసింద" ని ప్రార్థించాడు. మర్నాడు దేవుడు విష్ణుచిత్తుని అమాయకత్వానికి చిరునవ్వి మాలదాసరి కధను చెప్పాడు.

## షష్ఠాశ్వాసం

నేను వామనావతారం ధరించిన చోటుకు యోజనదూరంలో ఒక భక్తు డుండేవాడు. నా మహత్యాన్ని కీర్తిస్తూ గానంచేసేవాడు. అయినా అతడు తన

కులవృత్తిని విస్మరించలేదు. భక్తులిచ్చిన తీర్థప్రసాదాలు గ్రహించి ఆదే సర్వ స్వంగా జీవించేవాడు. ఒకనాడు అర్థరాత్రి సమయంలో మేలుకొని తెల్లవారిందని భావించి గుడికి బయలుదేరాడు. కొంతదూరం వెళ్లేసరికి అర్థయోజనదూరం ఆక్రమించుకొన్న ఒక మర్రిచెట్టు కనబడింది. అక్కడ దారితప్పాడు. ఆ మర్రిచెట్టును ఆశ్రయించుకొని కుంభజానుడనే బ్రహ్మరాక్షసుడున్నాడు.

ఆ రాక్షసుడు మాలదాసరిని ఆహారంగా గ్రహించాలని కిందకిదూకాడు. దాసరి రాక్షసునిమీద బాణాలువెయ్యసాగాడు. కాని రాక్షసునికి పట్టుబడ్డాడు. మాలదాసరి రాక్షసునికి హితవు చెప్పాడు. అతడు మాలదాసరికన్నా జ్ఞాని. తగిన సమాధానం చెప్పేసరికి దాసరి నీకునేను సమాధానం చెప్పలేను. కాని నా ప్రార్థన వినమన్నాడు. గుడికివెళ్లి భగవంతుణ్ణి కీర్తించి వస్తానన్నాడు. ప్రమాణం చేశాడు. రాక్షసుడు నమ్మాడు. మాలదాసరి గుడికివచ్చి అలవాటు ప్రకారం సంకీర్తనచేసి బ్రహ్మరాక్షసుని దగ్గరకు తిరిగివెళ్ళాడు. బ్రహ్మరాక్ష సునికి ఆశ్చర్యంకలిగింది. మాలదాసరికి ప్రదక్షిణంచేసి, విముక్తికలిగించమని కోరాడు. తన పూర్వజన్మ కథ చెప్పాడు. అతడు ముందుజన్మలో సోమశర్మ అనే బ్రాహ్మణుడు. ఒక పాపకార్యం చెయ్యటంవల్ల ఆరూపం ప్రాప్తించింది. విష్ణు సంకీర్తనం చేసినపుణ్యం ధారపోస్తే ఆరూపం మారుతుంది. తనకు శాపవిమో చనం కలిగించవలసిందిగా అతడు మాలదాసరిని కోరాడు. దాసరి తానంతటి త్యాగం చేయలేనన్నాడు. పూర్వం లక్ష్మణుడనే యోగీంద్రుని శిష్యుడు పూర్ణు డనేవాడు గురూపదేశాన్ని వ్యతిరేకించి అనధికారులకుకూడా మతకీలకాన్ని చెప్పి తరువాత గురువు దయకు పాత్రుడయాడు. అలాగే నీవుకూడా పుణ్యదానం చేసి నాశరీరాన్ని పునీతం చేయవలసిందని బ్రహ్మరాక్షసుడు మాలదాసరిని ప్రార్థించాడు. దాసరి అతని శాపవృత్తాంతం అడిగాడు.

చోళరాజ్యంలో పండితవంశంలో పుట్టిన సోమశర్మనైన నాకు విజ్ఞాని నన్న అహంకారం ఉండేది. రాజుతో అబద్ధాలుచెప్పి నా అధికారం చెలాయించు కునే వాణ్ణి. ఒక బ్రాహ్మణునికి మాయమంత్రాలతో ప్రాయశ్చిత్తంచేసి అతడిచ్చే బంగారానికి ఆశపడి పంక్తిభోజనం చేశాను. బ్రాహ్మణులు వెలివేసేసరికి ఒక వర్తకునిదగ్గర తూకంతూచే ఉద్యోగిగాచేరి అతణ్ణి మోసంచేశాను. ఆ వర్తకుడికి నా మోసం తెలిసిపోయేసరికి కొంతసామాగ్రి జాగ్రత్తపరచుకొని అర్ధరాత్రి పారిపోవటానికి ప్రయత్నించాను. ఒక బ్రహ్మచారి నన్ను వాగులోకి నెట్టి

వేశాడు. ప్రాణభయంతో ఒక నరశవాన్ని తెప్పగా చేసుకునే దాటబోతుంటే కొందరు మనుషులు మాపై బాణవర్షం కురిపించారు. ఒక చండాల జాతివాడు నన్ను ఎముకలు విరిగేలా కొట్టి వెళ్లిపోయాడు. నా బంధువులు నన్ను కాపాడి ఒకచెట్టుకింద వదలివెళ్లేసరికి నా మానవ శరీరం ఈరూపం దాల్చింది. అతనికథ విన్నాక దాసరి దీవనతో అతడు సోమశర్మగా మారాడు. దానరిని కీర్తించి, తపస్సుచేసి పుణ్యతీర్థాలు సేవించటంవల్ల ముక్తిపొందాడు.

ఈ కథలు తెలిసిన భూదేవికూడా నాతో చేరాలనే కోరికతో గోదాదేవిగా జన్మించి విరహతాపం పొందుతోంది. ఆమె తపస్సు ఫలిస్తుంది. అని చెప్పి గోదాదేవిని శ్రీరంగస్వామికి అర్పించవలసిందిగా మన్నారుదేవుడు చెప్పాడు.

## సప్తమాశ్వాసం

విష్ణుచిత్తుడు దేవదేవుడు ఆనతిచ్చిన ప్రకారం గోదాదేవితో శ్రీరంగం చేరాడు. శ్రీరంగనాధుని సేవించి స్తుతించాడు. శ్రీ రంగనాధుడు గోదాదేవిని చూసి విరహం సైచలేక ఆమెను తన శుద్ధాంతానికిచేర్చి ఒక మాయారూపిణిని ఆ స్థానంలో వుంచాడు. తీర్థప్రసాదాలు తీసుకొని అందరూ విడిదికి వచ్చేసరికి పల్లకిలో గోదాదేవి కనవడలేదు. విష్ణుచిత్తుడు దుఃఖసముద్రంలో మునిగి శ్రీరంగేశునికి మొరపెట్టుకున్నాడు. కూతుర్ని యింటిదగ్గర పెట్టుకుని యిక్కడ మొరపెట్టటం న్యాయంకాదని రంగనాధుడు పలికాడు. విష్ణుచిత్తుడు ఆత్రుతతో యింటికి చేరేసరికి గోదాదేవి యింటిదగ్గరే కనబడింది.

సరస్వతీ బ్రహ్మలు, పార్వతీశివులు విలిబుత్తూరువెళ్లి శ్రీరంగనాధునికి గోదాదేవినియిచ్చి వివాహం చేయవలసిందిగా విష్ణుచిత్తుణ్ణి కోరారు. విష్ణుచిత్తుడు అంగీకరించి వివాహంమాత్రం విలిబుత్తూరులోనే జరగాలని కోరాడు.

శ్రీరంగనాధుడు గరుడవాహనం అధిరోహించి విలిబుత్తూరుచేరి విశ్వకర్మ ప్రత్యేకంగా నిర్మించిన మణిమందిరంలో విడిదిచేశాడు. దేవతలందరూ కొలుస్తుండగా అదిదేవుడు వివాహ వేదికదగ్గరకు వచ్చాడు.

విష్ణుచిత్తుడు రంగనాధునికి పాదప్రక్షాళనచేసి షోడశోపచారాలు చేశాడు. దేవదేవునికి కన్యాదానంచేసి ధన్యుడయాడు. వివాహవిధి శాస్త్రోక్తంగా సర్వ మంగళాశాసనాలతో పూర్తయింది.

## ఆణిముత్యాలు

కథారంభంలో కృష్ణదేవరాయలు విష్ణుచిత్తుడు నివాసం చేసే విలిబుత్తూరును వర్ణించాడు.

చ॥ మలిచి పయోజకోశముల మాడ్కి నొనర్చిన పద్మరాగపుం
గలశపు పెట్టడా ల్పొమిడి కంబులతో నపరంజి యోడు బి
ల్లల నల వైజయంతముఁ జలంబున గెల్వఁగ దంశితంబులై
నిలిచిన యట్లు మాడువులనేకము లుల్లసిలు న్పురంబునన్. (1-52)

క॥ కోరకిత నారికేళ
క్ష్మారుహములు రత్న కుట్టిమంబులఁ దోఁపన్
ద్వారముల యత్న కృత శృం
గారముఁ గను నలికి మ్రుగ్గు ఘటియించిరనన్. (1-55)

మ॥ శయపూజాంబుజముల్ ఘటిం దడఁబడన్, జన్నీయి లేఁగౌనుపై
దయఁ దప్పన్ పసుపాడి, పాగడపుఁ బాదంబొప్పఁ జెంగల్వ డి
గ్గియ నీ రచ్యుత మజ్జనార్థము గటిం గీలించి, దివ్య ప్రబం
ధ యుగాస్యల్ ద్రవిడాంగనల్ నడతు రుద్యానంపు లోత్రోవలన్. (1-56)

మ॥ కలయ న్నీలమయంపుఁ దల్లి యొఱదాఁకం దేటనీ రొప్పు ర
థ్యల కూపంబుల మీలఁ జూచి వలభి వ్యాసంగి తుంగద్రు శా
ఖలలో నుండి గుబాలునన్ లకుముకుల్ క్రందై పడున్ లేచు మ్రు
చ్చిలి గేహేందిర ద్రావిడీ పరిచితిం జెందాడు చందంబునన్. (1-57)

ఉ॥ వేవిన మేడపై వలభి వేణికఁ జంట వహించివిప్పఁగాఁ
బూవులు గోట మీటు తటిఁబోయెడు తేఁటుల మ్రోఁత కామి శం
కావహమౌఁ గృతాభ్యసన లౌటను దంతపు మెట్ల వెంబడిం
జీవడి వీణ మీటుటయుఁ జిక్కొడలించుటయు న్స్మరింబడన్. (1-62)

చ॥ ద్రవిడ కుటుంబిను ల్పసుపురాచిన రత్నపుఁ దాపక్రింద నం
బువు దెరవాఱఁగా నిదురవోయి గరుత్తతి పచ్చబాఱినన్
భవన సరో మరాళములు భర్మ మయచ్ఛద గుచ్ఛవిస్ఫుర
ద్దివిజధునీ మరాళ వితతిభ్రమఁ బొన్చుఁ బురి న్బ్రమించుచున్. (1-64)

మ॥ తలఁ బక్షచ్చట గ్రుచ్చి బాతువులు కేదారంపుఁ గుల్యాంతర
స్థలి నిద్రింపఁగఁ జూచి యారెకు లుషస్స్నాత ప్రయాతద్విజా
వలి పిండీకృత శాటికల్సవి దదావాసంబుఁ జేర్పంగ రే
వుల డిగ్గ న్వెసఁ బాఱు వానిఁ గని నవ్వు న్శాలిగోప్యోఘముల్. (1-65)

చ॥ మనక సురక్తి హెచ్చనిదె మందని కంఠముఁ గౌగిలించి ని
క్కిన ఫణిరాజ వల్లి యెఱి గింవగ నోయనఁ బూగము ల్పరం
బునఁ బడు మట్టచేఁ జెఱకు ముత్తియము ల్చిటిలించి తద్రసం
బనిశము వండు నంతికతలాంతికఁ జూర్ణము జేయు నప్పురిన్ (1-70)

చ॥ మలయపు గాలిరేలు వనమాలి విమాన పతాక ఘల్లుమం
చులియఁ బసింది మువ్వగమి నొక్కొకమాటు గదల్ప నుల్కి మి
న్నులము తదీయ హేమ వరణాంచల చంపక శాఖలందుఁ బ
క్షులు రొద సేయ, వేగెనని కూడుదు రల్కలు దీఱి దంపతుల్. (1-74)

చ॥ కలమపు టెండుగు ల్ద్రివిడ కన్యలు ముంగిటఁ గాచుచుండి, త
జ్జలరుహ నాభ గేహ రురుశాబము సారెకు బొక్కులాడఁ, గిం
డెలపయి కమ్మ గ్రామ్య తరుణీ తతి డించిన పేఁప గంపలం
దలమగుచున్న చెంగలువ దండఁ దోలుదు రప్పురంబునన్ (1-75)

విష్ణుచిత్తుడు అతిథులకు అభ్యాగతులకు సత్కారాలు చేసేవాడు. శని వారం నాడు వారింటికి పరదేశి వైష్ణవులు ఎందరో వచ్చేవారు.

చ॥ కదళ గభీర పుష్ప వుటికాచ్చటఁ జేతుల నిప్పపిండిపైఁ
గుదురుగ నిల్పి, యోపు గతి గూనల నూనియనించి, త్రాట ము
న్నుదికిన శాటిత్రేల, నదినొక్కటఁ గ్రుంకిడి వత్తు రెందఱే
వదలక యాతనింట శనివారమున న్పరదేశి వైష్ణవుల్. (1-83)

పాండ్యదేశానికి రాజధాని అయిన మధురాపురంలో ఆడవారు సౌందర్య వతులు.

ఉ॥ సోరణగండ్ల రాఁగొదమ చుక్కలు పట్టి నతు ల్కవాటము
ల్చేరుప మౌక్తికంబు లని బిల్లలు వుత్తురు దమ్మటంచుఁ బొ

ల్పారు వితానహారములయం దొగి హారత వ్రేలి ప్రొద్దు వోఁ
గా రతి దస్సి గాడ్పులకుఁగాఁ దెఱవన్లను విచ్చి మేడలన్ (2-13)

మత్స్య ధ్వజుడు పాండ్యదేశాన్ని పరిపాలిస్తుండగా కాలగమనంలో వచ్చిన గ్రీష్మ వర్ణన.

చ॥ పడమర వెట్టు నయ్యెడుకు ప్రాశన మొల్లక కూటివేదలై
బడలిక నూడు నచ్చిలువ ప్రగ్గములన్ రవియాజ్ఞ మాటికిన్
ముడియిడఁ బిచ్చు గుంటు రథము న్నిలుప న్నయనంబు సాగమిన్
జడను వహించె నాఁగ దివసంబులు దీర్ఘము లయ్యెనత్తఱిన్ (2-49)

మన్నారుదేవుడు విష్ణుచిత్తుణ్ణి పాండ్యరాజు సభలో జరిగే వాదాలలో పాల్గొని వైష్ణవ తత్వం ప్రతిపాదించమన్నాడు. దానికి విష్ణుచిత్తుని సమాధానం

మ॥ గృహ సమ్మార్జనమో, జలాహరణమో, శృంగారవల్యంకికా
వహనంబో, వనమాలికా కరణమో, వాల్లభ్యలభ్యధ్వజ
గ్రహణంబో వ్యజనాతపత్ర ధృతియో, ద్రాగ్దీపికారోపమో,
నృహరీ వాదము నాకుః లేరె యితరు ల్నీలీలకుం బాత్రముల్. (2-91)

విష్ణుచిత్తునకు భగవంతుడు సాక్షాత్కరించాడు.

ఉ॥ ఇంగిలికంబునం దడిపి యెత్తు కసీసపు రెంటెమోయన
న్నింగి గరుత్పరం పరల నిగ్గున లేఁ బొగరెక్కెఁ; నంత పీ
చెం గలశాబ్ధి మీఁగడల జిడ్డెఱఁగించెడు గమ్మగాడ్పు; నిం
డెం గడు మ్రోఁత; పెన్దిరువడింగని; రా ఖగరాజు మూఁపునన్. (4-10)

సీ॥ చివురుఁ బొట్లపు దోయి జెందమ్ములనఁ దార్క్ష్య
హస్తోదరముల దివ్యాంఘ్రులమర,
నుసుఁ గప్పు మేనఁ దోఁచిన తదూర్ధ్వ చ్ఛాయ
లీలఁ దాల్చు పసిండి చేల మెఱయ,
ప్రాలిన యోగివర్గము నిర్మలాంతఃక
రణములు వోలె హారములు దనర,
సిరికిఁ బుట్టింటి నెచ్చెలు లౌట మనవికి
డాసె నా మకర కుండలము లమర,

తే॥ శ్రిత సితచ్ఛద వాత్యాభిహత పరాగ
వలయ మండిత కల్పశాఖలో యనంగ
శంఖ చక్రాంచితోరు హస్తములు దనర;
దోఁచెఁ గమలేక్షణుండు చతుర్భుజుండు, (4-11)
విష్ణుచిత్తుడు శ్రీ మహా విష్ణువుని ప్రస్తుతించాడు.

మ॥ బలిదైతేయ భయాంధకార భరిత బ్రహ్మాండగేహంబులో
పలఁ బై మండెడి తత్ప్రతాప మయ దీపజ్వాల డింద, న్గడుం
దలమై మింటికి గ్రక్కున న్నెగయు నుద్యత్తన్మహాచ్ఛాయ నాఁ
గల నీలాంగము శింశుమార మొరయంగాఁ బెంపవే వామనా! (4-24)

మ॥ శమిత క్షత్త్రి కళత్ర నేత్ర జల వర్షాపేశ నీ కీర్తి హం
సము క్రౌంచ స్ఫుట తాపకాంబక సుషిం జాఁగంగ నీక్షించి, వ
ర్షము రా నంచలు నందక్షేనేఁడుఁ జను నిచ్చ న్నాటి తచ్చేష్ట వా
యమిఁ; దిర్యక్కృతి దా గతానుగతికంబౌఁగా కుఠారీహరీ! (4-25)

మ॥ పవిధారా పతనంబుఁగైకొనని యప్పొలస్త్యుమై సప్త ధా
తువులం దూఱు పరిశ్రమంబునకు నుద్యోగించెనా; సప్త సా
ల విభేదం బొనరించి నిల్వక సలీలన్ జన్న యుష్మన్మరు
జ్జవ నాస్త్రం బొనఁగు న్సిరుల్ రఘు కులస్వామీ రమావల్లభా. (4-26)

చ॥ 'క్షితి హలకృష్టిఁ బుట్టి యడగెన్ క్షితి యందునె సీత' యంచుఁద
త్స్రుతి విరహార్తిఁ బాండిమము దాలిచి రామ శరీర మెత్తి, యా
క్షితి ఖనన క్రియ న్మగుడఁజెందఁగఁ గాక, కళిందజాతటిన్
క్షితి దువ నేటికి న్హలమ చేఁగొని నీ కవశాత్మత న్హలీ? (4-28)

ఉ॥ ఆయతయుష్మదాకృతి కరాగ్ర నగాంచల వాంత వారి ధా
రాయుత చంద్ర కాంత ఫలకాచి బింబిత యై చెలంగ, నా
రాయణమూర్తి మత్కవచ రత్నముచేఁ బరిరక్షఁ గాంచె నా
నో యదువీర, వృష్టిఁ బసి నూ అడఁబ్రోవవె సప్త రాత్రముల్. (4-29)

యామునాచార్యుడు పాండ్యరాజు సభకు వెళ్లిన సందర్భంలో కవి వర్షాకాల వర్ణన చేశాడు.

ఉ॥ కర్కశుఁ డంటకోర్వ, కుదకంబులు వాఃపతి గూర్చినట్లు న
యక్కర్కుఁడు దాను గూర్చి, మఱి యా సలిలాధిప చిహ్న వాహతం
బేర్కొలగంగనాతఁ డెలమి న్మకరస్థితిఁ గన్న నీర్ష్య, దాఁ
గర్కటకస్థుఁడయ్యె ననఁ గర్కటక స్థితిఁ గాంచెన త్తఱిన్. (4-86)

మ॥ అలపర్జన్యుఁడు భానుఁ డన్కొలిమిలో నభ్రంపుఁ బెన్తిత్తిప్పేరన్
జలమాఁగన్ బిడుగుక్కుజాత్యపు టయస్కాంతంపు నత్తున్క లో
పలఁ జూప, న్మహి మీఁది లోహరజముల్ పైఁ బర్వెనా, లేచె వా
త్యలఁ బ్రాగ్దావమషుల్మొగిల్మొదల గ్రద్దంతై దివిన్ లేచినన్. (4-90)

మ॥ తనతోయం బినరశ్మి లెత్త, నిలవాత్కారేణుమూర్తిన్మహేం
ద్రునకుంజెప్పఁగ, బ్రుచ్చుఁ బట్ట దివమందు న్వెల్లటింపం, భయం
బునఁ దద్రశ్మి సహస్రము న్వెనడిగెంబో డాఁగి వే గ్రుమ్మరిం
ప, నసం ధారలు దోఁచె మించు వెలిఁగింప న్మబ్బుల న్వెల్లిపై. (4-93)

చ॥ తొలితొలి వచ్చుధారల నెదుర్కొనిన్, తచ్చటఁ దీఁగ చుట్టుగా
నలముచు, ధాత్రిలేచి, పొలుపారె మలీమన బాష్పవల్లు; ల
త్తొలి ధారకే వెఱచి, తోన ఘనౌఘము వాన కాళ్లతుం
బలరిపుఁ డాల యాభ్రముల భంగిసె నంకెల లూన్చెఁ జోయనన్. (4-94)

చ॥ అతిజల మబ్ధిఁ గ్రోలె నితఁ డంతయు రా నతివృష్టిదోష మౌ;
మితినిపు డబ్దతం బరిణ మించిన తోయమె చాలుఁ బంట; క
న్మతి నలధాత గట్టి గగనంబున, పర్శుఁతన న్సమంతతో
వృతి యగు సేతుమండలము శ్రీ పరివేషము సుట్టె భానునిన్. (4-97)

చ॥ పెళపెళ మబ్బు బిట్టుఱుమ, భీతి విదూర శిలాంకురచ్చటో
త్పులకిని యై ప్రియు న్నిదురవోవు హరిన్వడిఁ గౌగిలింపఁగా,
దలరి ధరిత్రి సాఁచు గఱుదాలపుఁ గేళ్లనఁ గంకణంపు మ్రోఁ
తలఁ బులు దేల వండు పయిఁ దాల్చి నదుల్వెసఁ బొచ్చె వారిధిన్. (4-101)

సీ॥ ఇల్లిల్లు పెరుగ నొక్కింతబ్బు శిఖి; యబ్బె
నే నింటిలోఁ బూరి యిడి విసరక
రాఁజదు; రాఁజిన రవులుకోల్పాసాలఁ

గాని కల్గదు; మఱి దానఁ గలిగె
నేని కూడగుట మం దైనఁ బెన్పొగ సుఖ
భుక్తి సేకూర; ధా భుక్తి కిడినఁ
బ్రాగ్భోక్తలకె తీఱు బహుజనాన్నము; దీఱ
నారులం కొదవుఁ బునః ప్రయత్న;

తే॥ మాజ్యపట ముఖ్యలయ మెన్న; రాలయాంగ
దారులయ మెన్న రంతిక; కారణనిక
పచన నాంధ్రో గృహిణి రామిఁ బడుకమరుఁడు
వెడవెడనె యార్ప నొగిలి రజ్జడిని గృహులు. (4-127)

శరదృతు వర్ణన.

చ॥ కెరలు స్రవంతిఁ బై యిసుక క్రిందగువేళ నినుండు మేఘపుం
చెరసనఁ జల్లఁగా, విరహదీప్త కరప్లుత మౌ, నజీరకో
త్కరగుడమట్ల పద్మినులఁ గ్రమ్మ సకేసరమాధ్విపొల్చెఁ బైఁ
గర మరువారెఁ దేంట్లు సెకఁ గందిన ముత్తెపు సేసలో యనన్. (4-150)

శా॥ అప్పుల్వారిధిచేతఁ బుచ్చికొని, కార్యంబైన, మున్గొన్న య
య్యప్పుల్దా చని యున్నవృద్ధికముగా నవ్వార్ధికే తీర్పఁగా,
నప్పుణ్యాతి విశుద్ధజీవులు నిజాచ్ఛాంగంబులందోఁచు న
ట్లొప్పారె న్మశిబింబ గర్భితములై ద్యోచారి శుభ్రాభ్రముల్. (4-153)

చ॥ కలయఁగ వారిదేవతలు గాంచు సరోవర దంభదర్పణం
బులపయి దట్టంపుంజిలుము వోవఁగఁ దామలకంచు గీయఁగా
బలె నలు వంకలం గలయఁ బాయక తేలుచుఁబద్మ రేణువు
ల్కొలఁ కులఁబాసిపోఁజెలఁగిఁ గ్రేంకృతులిచ్చె మరాళమాలికల్. (4-180)

ఒకనాడు విష్ణుచిత్తుడు తోటలో ఒకపసిబిడ్డను చూశాడు. ఆబిడ్డ ఉన్న తోట చందం ఇలాఉంది.

మహాస్రగ్ధర॥
ఒకనాఁడామ్రాంకు రౌఘంబురు కుసుమ కుడంగోదర క్షోణిఁ దల్ప
ప్రకరంబై కాంక్షచే మున్పతులఁబదరిపైఁ బ్రౌఢి వాటించి నిట్టూ

ర్పక దొట్టన్ దస్సి పీరాయిత మఱిమఱి తారెట్ల మున్నట్లయో నా
యికలం గందర్పుఁడోటం బెఱిఁగి తఱిమి పీఁపేసెనా నంటు తోఁటన్. (5-8)

విష్ణుచిత్తుని పెంపకంలో గోదాదేవికి బాల్యదశ దాటింది.

సీ॥ వాతెఱ తొంటి కైవడి మాటలాడదు,
కుటిలవృత్తి వహించెఁ గుంతలములు
అక్షులు సిబులు రా నలుగంటఁ గనుఁగొనె
నాడించె బొమగొని యాననంబు,
సనుగొమ ల్పొగయ వక్ష ముపేక్షఁగడకొత్తెఁ
బాణి పాదము లెల్లవాలుఁ దొడఁగె,
సారెకు మధ్యంబు దారిద్ర్యముల చెప్పె,
తొచ్చోర్వకిటు లోఁగఁజొచ్చె మేను,

తే॥ వట్టి గాంభీర్య మొక్కఁడు వెట్టుకొనియె
నాభి, నానాఁటి కీగతి నాఁటి ప్రియము
చవుకయైనట్టి యిచ్చటఁ జనదు విలువ
ననుచు జాఱిన కరణి బాల్యంబు జాఱె. (5-7)

గోదాదేవి సౌందర్యం అతిలోకమైంది. యౌవనం ఆమె అందాన్ని అతిశయింపజేసింది.

శా॥ సైరంధ్రుల్పాయికెత్తి కజ్జలముఁ బక్ష్మశ్రేణికందీర్ప వా
లారుం గన్నులమీఁదుచూచు తఱి ఫాలాంచ చ్చతుర్థీ నిశా
స్ఫారేందుంగనె వక్త్ర ; మక్కనుటఁగాఁ బర్వేందుఁ డాత్మ ప్రభా
చోరుండుండఁగఁ దన్నుఁ దద్గత విభా చోరంబనున్ లోకముల్. (5-11)

తే॥ నవ వయస్సీధు మదముచే శ్రవణ కూప
ములఁ బడెడు శంక నలువ చాపలములుడుగ
నిడియె శృంఖల లనఁ గాటుకిడిన దీర్ఘ
పక్ష్మరేఖలఁ గనదోయి పడఁతి కొనరు. (5-14)

చ॥ అనయము రాగమొప్ప సహజానన చంద్ర కటాక్షపంక్తి ప
ర్విన నఘశంకఁ గర్జమను శ్రీ మఱువెట్టుఁజెలంగి చెండఁ గొ

ట్టి నవసిఁబడ్డ కమ్మ మగుడంగొను నంతకు నంసపాళి నం
గనయిడి దాఁచుపేరఁబెర కర్ణము కమ్మ పయిం దళుక్కనన్. (5-15)

చ॥ ఇలఁగల వస్తుసంతతులకెల్లను గచ్చిదు మాస్వభావ పా
టల రుచి కేమొ వేఱయొక డాలిఁక వచ్చునె? లక్కనీట మ
మ్మలమిన దెంత ముగ్ధ యిదియంచుఁ బదాబ్జము లంగుళీముఖం
బుల నగునట్లు మించు నఖము ల్మెఱయన్ గొమరారు నింతికిన్. (5-34)

గోదాదేవి శ్రీరంగేశుణ్ణి వరించింది. విరహవేదనకు లోనయింది. ఆ వేదనలో విష్ణునింద చేయసాగింది.

తే॥ తాను సురయోని నృపతనుల్ దాల్చి యకట
కామినీతతి నుడికించు కంటె నట్టె
గండెయును నల్లదాసరిగాఁడు కిరియు
హరియునై పోవుటయ మంచిదను యుగంబు. (5-41)

మ॥ ధరపైనీతఁడు పూర్వకల్పముల నక్తస్త్రీ విశాలాంబ కాం
బురుహశ్రేణి జలంబు మైఁబులకలున్ బూరించుచున్ వేఁచు దు
ర్భర కర్మం బలమంగవచ్చు జలజత్వ స్తబ్ధరోమత్వ కే
సరిత ల్ప్రార్ట్యవతార దంభమున నాచ్ఛాదించుఁ దాఁబ్రౌఢిమై. (5-44)

విరహంతో వేగిపోతున్న ఆమె శరీరంమీద ముత్యాలహారం సున్నంగా మారిపోయేది.

చ॥ ఎఱుఁగరుగా యొకద్భుతము! సీచెలి దీర్ఘికఁ దీర్థమాడ నా
యఱుతఁ దగిల్చిపోవుఁ దనహారము; వోయిన నేనుఁబోవు దు
న్మఱకువ వెంటఁబోవ జలమగ్నత నౌనది సున్నమైనఁదాఁ
గఱకఱఁబెట్టి సొమ్మడుగుఁగాని నిజార్తి యెఱుంగ దేమియున్. (5-61)

అంత వేదనలోనూ గోదాదేవి విష్ణునామస్మరణ చేయటం మరచిపోయేది కాదు.

సీ॥ అభినవ కువలయ శ్యామ కోమలమైన
దామూఁపు మకర కుండలముఁదాల్చ,

నిస్తులాస్య శ్రీ వయః స్తంభ నిక్షిప్త
నింబచ్ఛద బ్రూవు నిక్కు సుంత,
పరువంపు మంకెన విరివంపు నరవంపు
వాతెఱ చంద్రంపు వానగురియ,
నద్దంపు మెఱుఁగు వాలారు కన్గవచూడ్కి
శ్రవణ కుండల కాంతి సవతుగాఁగ,

తే॥ సప్త భువనాంగనానురంజనకు సప్త
విధ పరీవాహముగ గానసుధ వెలార్చ
మాడ్కి వేణువుపై వ్రేళ్లు మార్చిమార్చి
మరులు కొలిపితె గోవింద మందసతుల. (5-67)

విష్ణుభక్తుడైన మాలదాసరికథను మన్నారుదేవుడు విష్ణుచిత్తునికి చెప్పాడు. ఆదాసరి సత్ప్రవర్తన కలవాడు.

ఉ॥ ఆతఁడు ముఖ్యజాతిఁ గనినంతన పాయుచు నెండగాలి నెం
తో తదవుం బ్రసాద వినియోగము వార్చి వసించుచుం ద్రివ
ర్ణేతరజాతి మెచ్చి దయనిడ్డ ప్రసాదము దండె సాఁచి శ్ర
ద్ధాతి శయంబునన్ వినతినంది, భుజించుఁ, గొనుం దదంబువుల్. (6-9)

అర్ధరాత్రి సమయంలో వినబడిన ధ్వనులవల్ల తెల్లవారిందని భ్రమపడిన దాసరి విష్ణుసంకీర్తనకు వేళయిందని బయలుదేరి దోవతప్పాడు. ఒక బ్రహ్మ రాక్షసుడున్న మఱ్ఱిచెట్టు చూశాడు.

శా॥ కాంచె న్వైష్ణవుఁ డర్ధయోజన జటాఘాటోత్థ శాఖోప శా
ఖాంచజ్ఝాట చరన్మరుద్రయ దవీయః ప్రేషితోద్యచ్ఛదో
దంచత్కీటకృత వ్రణచ్ఛలన విప్యాపాది తాధ్వన్య ని
స్సంచారాత్త మహా ఫలోపమ ఫలస్ఫాయద్వటక్ష్మాజమున్. (6-15)

దాసరి బ్రహ్మరాక్షసునికి ఆహారంగా దొరికాడు. విష్ణుసంకీర్తనచేసి తిరిగివస్తానని చెప్పిన దాసరిమాట బ్రహ్మరాక్షసునికి నవ్వులాటగా కనబడింది.

శా॥ ఏ రాజ్యంబు నరుండు నోరికడివో నీబోధ మాలించు నిం
కే రాజ్యంబు నరుండు బానకయి మేనీఁ దాన యేతెంచుఁ దీ

పారన్నేఁ జననీమి యున్మగిడి నీవా రామియుందెల్ల; మే
లా రంతు ల్పలుపల్కు లంత్యకుల, యేలాచింత ల్చేలావగల్. (6-41)

బ్రహ్మరాక్షసుని నిందావాక్యాలు వినలేక దాసరి చెవులు మూసు కొన్నాడు. తప్పక తిరిగివస్తానని వాగ్దానం చేశాడు.

ఉ॥ ఎవ్వని చూడ్కిఁజేసి జనియించు జగంబు, వసించు నిజ్జగం
బెవ్వనియందు, డిందు మఱి యెవ్వనియందిది, యట్టి విష్ణుతో
నివ్వల నొక్క వేల్పు గణియించిన పాతకి నౌదు నేఁడ నే
నెవ్విధినైన నిన్గవియనేని" యనన్విని బంధ మూడ్చినన్. (6-43)

విష్ణుచిత్తుడు గోదాదేవిని శ్రీ రంగానికి తీసుకు వెళ్లాడు. ఆమెపై మరులు గొన్న రంగనాధుడు గోదాదేవిని అపహరించాడు. గోదాదేవి కనబడక విష్ణు చిత్తుడు రంగనాధునికి మొర పెట్టుకొన్నాడు.

ఉ॥ నెట్టన యల్లలచ్చి యలనీళయు భూసతి యుండ, నీకు నీ
నెట్టికసీలపై మనసు నిల్పుట కేమనవచ్చు? వెఱ్ఱియౌ
నట్టుగఁ బేద నన్నుఁ బరిహాసము సేఁతకుఁ దక్క వింత చూ
పెట్టెది? దిద్దు నెవ్వడిల నేఱుల వంకలు వారి డొంకలున్. (7-47)

విల్లిపుత్తూరులో గోదా శ్రీరంగేశుల వివాహం వైభవంగా జరిగింది.

మ॥ కల ధౌత ద్రవ చిత్రముల్మెరయ ముక్తాస్యూతమౌ మే చకాం
చలపుం బెండెఱువారి లగ్నము సమానన్నంబుగా వేల్పుఁబె
ద్దలు వంపన్ గుడ జీరకంబులు సముద్యత్ప్రేమ నన్యోన్య మం
జుల మస్తంబుల నుంచి రర్థిఁగను మించు ల్చిట్టు ముట్టాడఁగన్ (7-67).

చ॥ మఱి వనమాలి చూడమున మానిని ముత్తెపు ప్రాలు వోయుచో
మెఱయుఁ దదంగుశీ కినలమేళనఁ జక్రి చెమర్చ రాలిమై
నటి మూఁజీ ఘర్మబిందువులు నమ్మణులు న్మొగి లందు నుండి డా
ల్గిఱి గొన జాఱు ధారల బలె న్వడగండ్లబలె న్గనుంగొనన్ (7-63)

తే॥ ఇంతి దోయిట సేసఁబ్రా లెత్తుచోట
గుబ్బ పాలిండ్ల క్రేవఁగ్రక్కున మురారి
గన్ను వేయుటఁగని లజ్జ గదుర బాహు
లెత్తక కరాగ్రములనపై కెగరఁజల్లె. (7-69)

బొమిడికములు - శిరస్త్రములు

ఓడు బిల్లలు - పెంకులు

దంశితములు - మైమరువు

వలభి - చూరులు, పైగదులు.

గరుత్తతి - రెక్కల సమూహము.

కుల్య - కాలువ

ఆరెకులు - కావలివారు

ఫణిరాజవల్లి - తమలతీగ

పూగము - పోకచెట్టు

అంతిక తలాంతిక - సమీపానగల పొయ్యి

హేమ వరండాంచల చంపక శాఖలు - బంగారపు ప్రాకారముయొక్క కొనల యందలి సంపంగి కొమ్మలు

రురుశాబము - దుప్పి పిల్ల

కదళ గభీర పుష్ప పుటికాచ్ఛట - లోతైన అరటిదొన్నెల సమూహము

వితానహారములు - మేలుకట్ల యొక్క ముత్యాల హారాలు.

పిచ్చుకుంటు - అనూరుడు

శృంగార పల్యంకిక - విలాసము కొరకైన పల్లకి

వాల్లభ్యము - అధ్యక్షత

వ్యజనాతపత్ర ధృతి - వీవన, గొడుగు మోయుట

ద్రాక్ - వడిగా

ఎత్తుకసీసపు రెంటెము - ఎత్తుచున్న నల్లనిజంట నేతబట్ట

పెన్దిరువడి - గరుత్మంతుడు.

తార్క్ష్యుడు - గరుత్మంతుడు

సితచ్ఛద - హంసలుగలవి

శింశుమారము - మొసలి ఆకారముగల జ్యోతిశ్చక్రము

శమిత - సంహరింపబడిన

అంబక సుషి - బాణపు రంధ్రము

కుఠారీహరి - గండ్ర గొడ్డలి కలవాడు. పరశురాముడు

పవి - వజ్రాయుధము

కృషి - పక్కి

ఖననము - తవ్వుట

వాంత-కక్కబడిన

వసి - గోగణము.

ఉలుపాలు - కానుకలు

భ్రుకుంసులు - సట్టువలు

వాత్యాతేణమూర్తి - సుడిగాలిలోని దుమార మనెడి రూపము

మలీమసబాష్పవల్లులు - మలినములైన అవిరి తీగలు.

ఘనౌఘము - మబ్బుల గుంపు

ధాత - బ్రహ్మ

సమంతతోవృతి - చుట్టూ ఆవరించి

పరివేషము - గాలిగుడి

విదూర శిల - వైడూర్యరములు

పులు - పచ్చిక

ఆజ్యపటముఖ్యలయము - నేతి గుడ్డలు లోనగు వాని నాశనము

అరజక పచన నాంభోగృహిణి - రాత్రి వరకు ఇతరులకి వండుట చేత అన్నము లేని ఇల్లాలు.

సజీర కోత్కరగుడము - జీలకర్రతో కూడిన బెల్లము

మాధ్వీ - మకరందము

సేసలు - తలబ్రాలు

జ్యోచారి శుభ్రాభ్రముల్ - మింట చరించు తెల్లమబ్బులు

వారిదేవతలు - జలదేవతలు
సరోవరదంభ దర్పణములు - సరస్సులనే అద్దాలు
కుసుమ కుడంగము - పూ పొదరిలు
కజ్జలము - కాటుక
చతుర్థీ నిశాస్ఫారేందుడు - చవితినాటి చంద్రుడు
సీధువు - సుర
అంసపాళి - భుజాగ్రము
నల్లదాసరిగాడు - తాబేలు
కిరి - వరాహము
సక్తస్త్రీలు - వలచిన వనితలు
అంబకాంబు రుహములు - నేత్రకమలాలు
దంభము - మిష
దీర్ఘిక - కొలను
అలిత - మెడ
డామూపు - ఎడమ బుజము
నింబచ్ఛద - వేపాకు
భ్రూవు - కనుబొమ్మ
జటా ఘాటోత్థ శాఖ - ఊడలపైన వక్కలనుంచి మొలచిన కొమ్మలు
ఝాట - సమూహము
దవీయః - దూరమునకు
కీట కృత వ్రణ - పురుగులచేత చేయబడిన రంధ్రములు
అధ్వన్య నిస్సంచార - బాటసారులు నడయాడుట లేనందున
స్ఫాయత్ - విస్తరిల్లుచున్న
వటక్ష్మాజము - మర్రిచెటు

నోరి కడి - నోటిలోని ముద్ద

నెట్టికసీల - సదాచారముగల పరతంత్రురాలు

కలధౌతము - బంగారము

ముక్తా స్యూతము - ముత్యాలతో కుట్టబడినది

మేచక - నల్లని